# మనవి.

"కర్మలలితమగు విశాలజీవితమునందు గౌరవకార్యముల కెట్టి పవిత్రత తనరునో, కొంచెపుం బనులకుంగూడ నట్టిపవిత్రత కలదనునది మహాకవి రవీంద్రుని యుదాత్తవాక్యము". ఈయుదారాశయమునకు నిదర్శనములు, మనదేశమంతట నల్లుకొనుచున్న యభినవప్రబోధముచే ప్రేరితములై, విరివిగం గాన్పించుచున్నవి. ఈనూతనోత్సాహమునుండి యుద్భవించిన ధర్మకృతులకు, విజయవాడకనతిదూరముననున్న, పడమటలంక, రమణీయాంగమువంటిది.

పడమటలంక ప్రకృతికి ప్రియపుత్రిక. ఫలవంతములు, సునోజ్ఞములునగు తరువులు, పుష్పఫలలతా శోభితములగు తోటలును, నిసర్గగాంభీర్యముచే నిశ్చలములగు పర్వతములును, ఈచిన్నిగ్రామము నానుకొని యుండును. ఈపల్లెయందు క్షత్రియదంపతులగు నగనిగడ్డవల్లభరాయలకును మహాలక్ష్మమ్మకును గుణసంపన్నులేవురు పుత్రులు గలరు. వీరిధర్మాసక్తి కోదండ రామాలయ నిర్మాణమునకును, పాంథజనోపయోగకరమగు సత్రము కట్టించుటకును గారణము. ఈసత్రమునకంతర్గతముగ వైద్యవిద్యాకుశలులగు బసవయామాత్యుఁడగు తృతీయ సోదరుఁడు ఆయుర్వేద ధర్మవైద్యశాల నొకదాని స్థాపించి వైద్యసహాయ మొనర్చుట కీర్తనీయము. ఇచటనే యభిమానుల సహాయమునఁ షుమారు వేయిరూప్యముల విలువఁగల చిన్న మేడయందు పుస్తక భాండాగారమొండు నిర్మింపఁబడినది. ఈకార్యనిర్వహణమున భారమంతయు వహించిన సీతారామావధూతలవారు వంద్యులు. కోదండరామాలయ ధర్మకర్తృత్వపదవినున్న జ్యేష్ఠసోదరవర్యునకును వారుపరోపకృతికై చేయు కష్టములపాలు పంచుకొనువారికిని, యితరధార్మికులకును నిరామయువిశ్రాంతి శ్రీరామచంద్రుఁడొసంగుఁగాక!

పడమటలంక తొలుదొల్తనుండియు నామనస్సు నాకర్షించినది. రామాలయమును, నచటి కల్యాణోత్సవములును ఆనందదాయకములగుటచే నచటికి తఱచుఁ బోవుచుంటిని. నాయనోపీది శ్రీరామప్రేమ తేజముచే వికసితమగుటచేతనో, కోదండరాముని దయాసేచనముచేతనో "పడమటలంక వాసననుఁ బాలనసేయవె జానకీపతీ!" యనుమకుటమప్రయత్నముగ నాకుం దోచెను. హృద్గతములై పెనగులాడు భావములను వెలిబుచ్చుటకై, పద్యములింకను వ్రాయఁదలఁచి, కవితారచన నారంభించితిని. ఇరువది యైదుపద్యములను కొంతకాలమునకు ముగించితిని. పదపడి చిత్తవృత్తియనేక విధములఁ బోవసాగెను. సాహితీచర్చ సమగ్రముగ నొనర్పక, కవితయొక్క సౌందర్యసౌష్ఠవములు నెఱుఁగక, పద్యము లల్లసమకట్టుట, వెగటుగఁ దోచెను. 'అమలోదాత్తమనీషచే' సిద్ధించు 'రమణీయార్థ ప్రతిపాదక' శక్తినిర్బంధించిన రాదని యెఱింగి, సరస్వతీదివ్యపీఠము నసత్కల్పనలచే కళంకిత మొనరింపనను గాఢనిశ్చయమేర్పఱచుకొంటిని. నాసంకల్పము సఫలమొనరించుకొనుటకు కవీశ్వరుల యొద్దకేగి రాముని ప్రేమామృతమును సంగ్రహించి వలయు నానందమునుఁ బొంది, సోదర సోదరీమణుల కుపయుక్తమని రామభక్తుల కేరనర్పించుచున్నాడను. తమయున్నతాశయములను లోకమున కందసాధ్య మొనరించిన కవిచంద్రులకెల్లరకు ప్రణయపూర్వకనమస్కారము లీగ్రంథ ముఖముననంపియుచున్నాడను. ముద్రణాస్ఖాలిత్యములును, తదితరలోపములకును పాఠకమహాశయులమన్నన వేఁడెద.

ఇట్లు,
సత్కవివిధేయుఁడు,
నాళ్ళచెరువు రంగరావు.

---

తె॥ ఈపుస్తకముపైవచ్చుస్వల్పలాభమును పడమటలంకలోనున్న ధర్మవైద్యశాలకు వినియోగింపఁబడును గాన, ధార్మికులెల్లరు తమబాధ్యతను నెఱుంగగలరని నమ్ముచున్నాడ. ఇందుసాధకులకుగాను నొకయాశ్రమము నిర్మితము.

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ

# పడమటలంక రామస్తవము

ఉ॥ "శ్రీకవితాలతల్ పవన సీమలకేగి తదీయపాలకా
నీకము గోరఁగా సుమములిచ్చిరి, తత్సుమముల్ భవత్పద
శ్రీకమలార్పణంబు నొనరించితి; దీనుఁడనయ్య, సత్కృపా
లోకముఁ జోడఁబోవవలె నిక్కెనవరంకను జానకీపతీ"॥

నా॥ ౧౦॥

శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యకవి (బి.ఏ.)
విరచితము, గుంటూరు.

చ॥ పుడమిని నేదిచెసినను, భోజనవేళల, యజ్ఞదానముల్
తడయకొనర్చుచోఁ దపములన్ బొనరించునెడన్ ద్వదర్పణం
బుడుగక చేయుచుండ్రి బుధలుత్తమ దైవమటంచునమ్మి నిన్
బడమటలంక రామ! ననుఁబాలనసేయవె జానకీపతీ॥ ౧

చ॥ చెడుగులు నిన్నుఁ గాంచెదరు చిల్లర దేవులతోడపాటు వా
రొడలని నీకెఱుంగక, యయో! యఘువహానని రామదాసు చె
ప్పఁడె మునుపన్యదైవముల భక్తభజించిన వారిపొందుచేఁ ॥బడ॥ ౨

చ॥ అడరిసమస్తదైవములయం దొనరించునమస్కృతుల్ పదం
పడినినుఁ జేరునంచు స్మృతివాక్యముచాటుచునుం డెఱింగియుఁ
జడులుభవత్పరత్వమును సైఁపఁగజాల రదేమిచిత్రమో
పడమటలంకరామ! ననుబాలనసేయవె జానకీపతీ॥ 3

చ॥ కడుకొనివేదమెల్ల నిరుకాండలు, రెంట నుపాస్యుఁడీవె కా
యొడఁదలలో నెఱుంగరొకొ యియ్యది వైదికసాంప్రదాయికుల్
నుడువులకేమి నిన్నె మదినూల్కొను భక్తిభజింతురెప్పుడున్॥పడ॥ ౪

చ॥ దుడుకుఁదనంబుగాక మదిఁదోఁపదొకో ప్రణవంబుతోడనిం
పడరిసమస్తవేదముల యాదినిసంతమునన్ గరంబు వె
ల్గెడిహరినామమొందెయని లేదిక నెవ్వరికట్టికీర్తిరో॥ పడ॥ ౫

చ॥ వెడఁగులెయన్యదైవములఁ బ్రీతిభజించి లభింతురల్పముల్
బుడిబుడి, నీపథంబవిధిపూర్వకమంచు నెఱుంగలేక, యే
నుడిగిన నిన్నె కోరవలె; నంతములేనిఫలంబునిత్తువో॥పడ॥ ౬

చ॥ నుడువరె భాష్యకర్తలు మనోహరసూత్రలతోడ వాసుదే
వుఁడెపరతత్త్వమంచితర బోధమొనర్చెనె శంకరుండు నీ
కడవఁగ వేఱెదైవము జగంబుల లేఁడని చాటవచ్చునో॥పడ॥ ౭

చ॥ నుడివితి నన్నె నన్నెయని నూఱుస్థలంబులయందు గీతలోఁ
జెడుగుల కేవకారములు చింపరు, తత్త్వ మెఱుంగఁజాలకే
యుడుగక గీతలన్ నమలుచుంద్రు రసజ్ఞులు కామినక్కటా॥పడ॥ ౮

చ॥ స్పృశ [illegible] నన్నెపూనుఁడని [illegible] ట్రుముగాని నీ
యడుగుల [illegible] సని యాత్మ నెఱుంగరు యుష్మదంఘ్రులన్
[illegible] దమిన [illegible] దాల్చి కడవుఁ [illegible] ముఁ జెట్టునీదునో॥పడ॥ ౯

చ॥ [illegible] పలాడనేల భగవత్పద వాచ్యుఁడవీవెకాన్న నీ
యడనదిరూపమంచు వచియించును వ్యాకృతియన్యులందుఁగ
న్పడునది గౌణరీతిశివభాగవతాద్యసమర్థయుక్తిచేఁ॥ పడ॥ ౧౦

చ॥ కొడుకుకదా చతుర్ముఖుఁడు, కూరిమిపౌత్రుఁడు రుద్రుఁ; డీవు నో
క్కఁడవు త్రిమూర్తులందనుట కార్యము లేదు: భవద్విభూతిఁగ
న్పడెను పృథక్స్వరూపమున వైష్ణవమూర్తి, పరుండవీ వెకా
పడమట లంకరామ! నను పాలన సేయవె జానకీపతీ॥ ౧౧

చ॥ జడియఁగనేల నిన్నుపనిషత్తులు గీతలు బ్రహ్మసూత్రముల్
నుడువఁగ మూలతత్త్వమని, లో, వెలినుండి భరింతువంటి, చి
జ్జడములకున్ విలక్షణపదస్థుఁడవై పురుషోత్తమాఖ్యచేఁ ॥పద॥ ౧౨

చ॥ ఉడుగక చాటెడున్ బురుషసూక్తమజస్ర, మజాయమానుఁడై
పొడముదు వీవనేకవిధమూర్తులనం, చవతారబోధయే
ర్పడినను గాని నిన్మనుజభావముతోఁ గనకుండఁ జాలరో ॥పద॥ ౧౩

చ॥ అడరెడుఁ దత్త్వలింగముల నన్నిటనీఘనమూర్తిఁ గీరితిం
చెడిపదముల్, దదన్యములు చెల్లును గౌణములై; శ్రుతిన్ వినం
బడుపదముల్ పరస్పరసమన్వయశక్తినినున్ నుతించుఁగా ॥పద॥ ౧౪

చ॥ పుడమిని సాత్త్వికోత్తముల పుణ్యఫలంబవు, వారు నిన్నుఁదా
మెడతెగనట్టి భక్తిభజియింతురు; రాజసతామసుల్ మదిన్
దడవరొకప్డు గొల్చిన ననన్యగతిన్ గొలువంగఁ జాలరో ॥పద॥ ౧౫

చ॥ విడువుము సర్వధర్మములు, వేగమయవ్యభిచారభక్తినా
యడుగులె యాశ్రయింపుము మదన్యము లేదు సమస్తపాపమే
నుడిపి విముక్తినిత్తునని యూగడఁబల్కితి గీతలందునో ॥పద॥ ౧౬

చ॥ నడచితి మేలుబంతిగ జనంబులలో సకలాశ్రమంబులన్
గడపితి ఘోరరాక్షసులఁ గీతిఁగడించితి శిష్టరక్షణన్
గడలి సమస్త సద్గుణగణంబులకన్న యశంబుఁ గాంచితో ॥పద॥ ౧౭

చ॥ పొడమఁగనైతి దోమగనొ పుర్వుగనో మతిపక్షిగానొ నేఁ
గడకొక చాపటాయిగనొ కల్మషదూర! భవచ్ఛుభాకృతిన్
దడయక కాంచియుందుఁగద నాఁడె భవాబ్ధిదరించియుందుఁగా॥ పద। ౧౮

చ॥ ఉడుతకుఁ గోఁతిమూఁకలకు నూఁగకయబ్బెను నీదుసేవ, మ
ర్త్యుఁడు ఋజుమార్గమందుఁ జనఁబోపఁ డహంకృతి, జంతుజాలముల్
నడచు యథోపదిష్టగతి న్యాయ్యమె నీదగు పక్షపాతమో
పడమట లంకరామ ! నినుబాలన సేయవె జానకీపతీ॥ ౧౯

చ॥ ఎడపక వేదమెల్లఁ బఠియించిన లాభము లేదు, కర్మముల్
సుడివడఁ జేసినన్ ఫలముసున్న, త్వదంఘ్రిసరోజభక్తియె
న్నఁడును నెఱుంగఁజాలని జనంబులకున్ శ్రుతివేద్యవైభవా॥పడ॥ ౨౦

చ॥ పడితి నగాధసంసరణవార్ధిమధ్యమునందుఁ గొట్టుకోఁ
దొడఁగెఁ దరంగ ఘట్టనలతో నసువుల్ మదిఁదోఁపఁ దయ్యోనీ
యడుగులు దక్కఁ దెప్పఁగదయయ్య నియింకఁ దరింతుసంసృతిన్॥బడ॥ ౨౧

చ॥ విడిచితి వర్ణభేదములు, వీడితివిత్తసతీసుతాదులన్
విడిచితిజాతిభేదములు, వీడితిఁ దజ్జనితాభిమానముల్
నడచెద సత్పథంబున ననంతఫలప్రదయింక మీఁదనో ॥పడ॥ ౨౨

చ॥ జడుఁడను బాపకర్ముఁడ నృశంసుఁడ భాగవతాపచారిని
లుఁడఁ బరదారవిత్తకృతలోభుఁడ డాంబికవర్తనుండ నేఁ
బడితిని గాళ్ళమీఁద నిఁకఁ బాలనముంచెదొ నీళ్ళముంచెదో ॥పడ॥ ౨౩

చ॥ గడుసుఁదనంబొ నిర్దయయొ కల్పనఁ జేసితి పాపపుణ్యాఖ్యం
బెడిదపుమార్గయుగ్మము వివేకులకైనఁ దదీయసూక్ష్మముల్
కడఁక నెఱుంగరావనినలాఁతుల కెట్లు సమన్వయంబగున్ ॥బడ॥ ౨౪

చ॥ బుడుతలమేము, ప్రేరకుఁడవున్ ఫలదుండవు, కర్తలంచుఁ జే
రిడిమము శిక్షసేయఁదగునే? నరకంబులు తూకులెక్కయే
అడుగులఁ బట్టి వీడమెటులచ్చటికంపెదొ మమ్ముఁ జాతమో ॥పడ॥ ౨౫

చ॥ అడుగఁ ద్రిలోకసేవ్య భవదాకృతిచూపుమటంచు వైభవం
బడుగఁ ద్రిపాద్విభూతియును నక్కఱలేదు భవత్పదంబులే
నడిగెదఁ దల్లి స్తన్యమెగదా పసికూనల కాసగొల్పెడిన్ ॥బడ॥ ౨౬

# శ్రీమాన్ శేషాద్రిరమణకవులచే విరచితము, శతావధానులు.

గంపలగూడెము రాజావారి ఆస్థానకవులు.

ఆశుధారలోఁ జెప్పబడినవి.

చ॥ జడుఁడ వివేకశూన్యుఁడను శక్తివిహీనుఁడ నీదుపాదముల్
కడుభయభక్తులింపెసఁగఁగా స్మరియించుచునుంటి వేగ నా
యిడుములబాపి శాశ్వతసుఖేచ్ఛనొసంగి కృతార్థుఁ జేసి శ్రీ
పడమట లంక రామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧

చ॥ కడుఁజలియించుచుండు మది, కాయము వ్యాధిమయంబు భావమె
ప్పుడు విషయాంతరంబులను బొల్చుచునుండు, నినున్ దలంపనా
కుదుగని తాల్మి యిచ్చియటు లోమెదొ భారము నీది సుమ్మి శ్రీ ॥పడ॥ ౨

చ॥ నడుచెడు వేళ, మంజుకలనాదవసప్రియగీతముల్ చెవిన్
బడు ననుయాన, నంగనలవాలికమాపులు కాతుకమ్మెన
ర్పడితతి యుష్మదీయపద సేవనమున్ బొనరింపఁజేసి శ్రీ ॥పడ॥ 3

చ॥ ప్లాడమినదాదినీ చరితమున్ వినివారఁగఁగ్రోలనైతి, పై
వెడఁగుగయావనంబుడిపి వీఁడిన్నైతి, పరాగ్రసిద్ధియి
ప్పుడు నయచేయు సంచుఁదలఁపుల్ నినుఁజేరఁగఁగోరుచుంటినో ॥పడ॥ ౪

చ॥ ముడిచిన కేలుదోయి యొరయను, మోడ్చకనుంగవయున్, స్థిరేచ్ఛయున్
కడకయుఁ జెన్ను మీఱగను గౌరవబుద్ధి స్మరింతు, నన్ను భ
క్తుఁడనియు భృత్యుఁడంచు దయతోఁ దిలకింపుము మోక్షమిమ్ము శ్రీ ॥పడ॥ ౫

చ॥ ఇడుములఁ బొందువేళ పరమేశ్వరుఁడెచ్చటలేఁడటంచు నా
విడిచితి సౌఖ్యమందుతఱి విశ్వము నీశమయంబటంచు నే
గ్పడవచియించినాఁడను బరస్పరభేదమెఱుంగనైతినో ॥పడ॥ ౬

చ॥ తడయకుపన్యసించుటలు దైవము లేఁడనుటల్ త్యజించి, యొ
క్కడెపగమార్గదాయియగు గణ్యుఁడు వాడె రఘూద్వహుండు నా
యిడుములఁ బాపనాతడొకఁడే గలఁడంచుఁదలంచుచుంటినో ॥పడ॥

చ॥ పుడమిపొలంతినాఁ దగిన పొల్తుక జానకి భార్యగా, వసి
ష్ఠుఁడు నిజగోత్రకర్తగ బ్రసిద్ధగుణాంబుధి యంజనాతనూ
జుఁడు పదపద్మభక్తుఁడుగ శోభిలు తావకమూర్తి గాంతునో
పడమట లంక గాదు! ననుబాలన సేయవె జానకీపతీ॥ ౮

చ॥ కడలిపయిన్ సముగ్రశిత కాండపరంపగ నింపవింటి నె
క్కుడి మతియంతలోనె బరికీర్ణదయానుయదృగ్రుచిచ్ఛటల్
జడనిధిపైననింపనిను శాంతుఁడవందునా? కోపియందునో? ॥పద॥ ౯

చ॥ కడచినకాలముల్ దలఁపఁగా బనిలేదిఁక, నిన్ను నింకనై
ప్పుడు స్మరియింపనిత్తఱిని బూనితిచిత్తమునన్ బ్రతిజ్ఞ నా
కడఁకకు సర్వమైనఫలకాండము నిమ్మనియైనఁ గోరనో ॥పద॥ ౧౦

మధ్వ శ్రీ శాస్త్రి కృష్ణాచార్యవిరచితము,
టవున్ హైస్కూలు సంస్కృత పండితులు, శతావధానులు,
గుంటూరు.

ఉ॥ జడుఁడ నసత్యవాది నఘుసత్తుఁడ లోకవిగర్హ్య వృత్తుఁడన్
బిడియములేని వాఁడ నవివేకిని మూర్ఖుఁడ మూఢుఁడన్ సు
గర్వుఁడ నిటులయ్యు నిన్ను మదిగూర్మిగ గొల్చుచునుంటిగాన నో ॥పద॥ ౧

చ॥ జడనిధికన్యకాధవ, విశాలదయామయ దుగ్ధవార్ధిమ
గ్నుఁడ నతినీచవృత్తిని ననుం విడవాడఁగఁ బోకుమయ్య యీ
పుడమిని నీవు దక్క ననుఁ బ్రోచెడివారెవరయ్య యింక నో ॥పద॥ ౨

చ॥ అడఁగెను దేహశక్తి నడుగం దెను గర్వము మానసాన యి
ప్పుడమిని దేని గన్నను తబుక్కను బుద్ధి జనించె రాముఁడొ
క్కఁడె నిజమైన బంధువని గన్గొను నిశ్చయమింక నాకునో ॥పద॥ ౩

ఉ॥ విడచితి దుష్టభావమును వీడితి బంధుగులందు నాసనే
విడిచితి విత్తవాంఛ యిఁక వీడితి సొంతసనేల యంతయున్
విడిచి భవత్పదాబ్జములనే మదిఁ గట్టిగఁ బట్టినాఁడనో ॥పద॥ ౪

చ॥ అడుగఁగఁ బోఁడు నీకు సుగమాయని నన్నొకఁడేని మాటువ
ల్కఁ డిపుడు బల్కరించిన నొకండును నింతకుమున్ను నాకులోఁ
బడినటువంటివార లటు ప్రక్కఁ దొలంగుచు నేగుచుండిరో
పడమట లంకరామ! ననుఁ బాలన సేయవె జానకీపతీ॥ ౫

చ॥ అడుగను రాజ్యమిమ్మనుచు నడ్గను మాన్యము లిమ్మటంచు నే
నడుగను భోగభాగ్యముల నడ్గను స్వర్గము మోక్షమేని నే
నడిగెద నీపదాబ్జముల యందొక నిశ్చల భక్తిమాత్రమే ॥పడ॥ ౬

చ॥ పుడమియు రాజ్యముల్ చెలులు భోగము భాగ్యము బంధువర్గముల్
చెడి కడు దుఃఖముల్ బొసఁగఁ జేయును మానవకోటి కెన్నఁడుల్
జెడనిది నీదు పాద సరసీరుహ భక్తియె నాకొసంగవే ॥పడ॥ ౭

చ॥ అడవిని ఱాయియై పడు నహల్యను బ్రోచిన నీపదాబ్జముల్
గడిగి కృతార్థుఁడైన జనకక్షితిపాలుని పున్నెమెమనల్
జడనిధికన్యకాంకిభవ జానక నన్పనఁ జేసెనీకహో ॥పడ॥ ౮

చ॥ అడుగిడఁ బాపకర్మములె యంటుచునుండును గాని పున్నెమె
ప్పుడు గలుగంగఁ బోదు, ఖలపూరుషమర్దన! నీదు నామముల్
నుడువఁగ నోరురాదిఁక ననుల్ గరుణించెడువాఁడె వండురా ॥పడ॥ ౯

చ॥ కొడుకులు లేరటంచు నొక కొన్ని దినంబులు చింత పిమ్మటల్
గుడువగ బువ్వలేదనుచుఁ గొన్ని దినంబులు చింత యెంతయే
ర్పడినను చింతమాత్రము భవంబున దీరదదేల నాకునో ॥పడ॥ ౧౦

చ॥ దుడుకుఁ దనంపుఁ జైదముల తోడనె బాల్యము సెల్లెపిమ్మటల్
బడతుల చింత జవ్వనము పాడయిపోయెను వార్ధకంబునల్
దడఁబడు బల్కయుడ్డ, భవతారక! యింకనినున్ భజింతునో ॥పడ॥ ౧౧

చ॥ పుడమిని మాతృగర్భమున బుట్టినదాదిగ బాపకర్మముల్
విడువనుసరించి నీదుపదకంజములల్ గొలువంగ బోని యీ
జడమతి, సృష్టిచిత్తు భవసాగరమగ్నునిపండితుల్ ఖలుల్ ॥పడ॥ ౧౨

చ॥ జడమతులైన రక్కసులసాధ్యబలుల్ మునిరాజు జన్నముల్
కడువడి బాడుసేయ తటిగ్రక్కునవారలఁ జంపియుంత న
య్యడవిని బాగుఁజేసిన మహానుభావునిఁ గొనియాడ శక్యమే
పడమట లంక రామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧౩

చ॥ కడలికి నొక్కసేతువును గట్టి కపీంద్రుల చేతఁబట్టి యా
కడుదురితాత్ము రావణుని గర్వమడంచిన నీకు వెన్నఁగాఁ
బుడమిని లెక్కయేమి మము బోఁటుల బ్రోచుటనంగనక్కటా॥ పద॥ ౧౪

చ॥ పడితి, ననవ్యాకష్టములు బాడయితిన్, ప్రమాణవంతయేన్
గడగి యొనర్చియే నెరుగగా యెప్రుడేనియుఁ బున్నె, మీగతిన్
గడచెను గాలమెల్ల కొరగాని మనుష్యుఁడ నైతినయ్యరో॥ పద॥ ౧౫

చ॥ దుడుకుఁదనాన జానకిని దొంగిలినట్టి దశాస్యదోర్బలం
బడపిన నీదు మేల్ కఱకుటమ్ముల మారికిగా నిశాచరత్రయం
బు, డగరజంపి, నీచరణముల్ గనఁజేయుచు నాకు నెవ్వరో ॥పద॥ ౧౬

బ్రహ్మశ్రీ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి విరచితము.

పొన్నూరు పోష్టు, చందోలు.

చ॥ ఒడలిమెఱుంగు మబ్బునెడ నొప్పెడు నమ్మెఱుఁగట్లు జానువా
మడుగుకు దోడునన్ దోడలమాలిమిగాపుచు నిల్మి కన్యనే
ర్వడసిన కల్కిమిన్న చెలువంబున కెయ్యెడ జొక్కగాంచునో॥ పద॥ ౧

చ॥ జడముజరాదిదూషితము శాశ్వతమీ మొదలంచెఱింగియున్
విడువగనీయదాస, తనవెఱ్ఱియదానికిఁ జుట్టి యిట్టులే
నడలితి దివ్యమూర్తిఁ యినుమప్పడు సంబటులందగంటినో॥ పద॥ ౨

చ॥ కడలిదరించి సీతగనికజ్జ మెఱంగిపురంబు గాల్చి మ్ర
క్కడులఁదొలంచి నిదుపదకీర్తనవైభవమంద మించు గన్
నుడసిన మేటి యల్లెడల నెత్తిడనంగ్రముల సున్నియవే పద॥ 3

## 9

### బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి విరచితము.

గుంటూరుజిల్లా, ఇంటూరు.

చ॥ ఉడిగి మడింగికిన్ బ్రతిఫలోదయముల్ గయిసాధికోరున
బ్బుడుగుల దుచ్ఛదైవముల బ్రాపిసుమంతయు గోరనయ్య నీ
యడుగులె కొల్చుకొందు జడుడాయనిత్రోతువో యుద్ధరింతువో
పడమటలంకరామ! నను బాలనసేయవె జానకీపతీ॥ ౧

చ॥ కొడుకులు కొమ్మలున్ విడిదికొంపలుగోడలు గాపురంబు బె
మ్మహాగుకు గ్రాహకంబులనుమాట నెఱుంగక మోసపోయితిన్
జెడితిని కోలుపోయితిని చిక్కులకెల్లని కేమిసేతువో ॥పడ॥ ౨

చ॥ జడధులు నీపరాక్రమవిశాలత దామెఱుగంగ నేర్తురే
యడుగుల జేరునంతకు మహాత్మయథార్థశౌర్యసజ్జులై
ప్పుడును దదాత్మతాకలన బొంగుచు బొర్లుచు నుందురట్లుగా ॥పడ॥ 3

చ॥ బడలితినయ్య తండ్రి పలుబాములలోఁ బడియింక నెట్టులీ
తొడుగుకృతార్థతన్ గనుటనోరపునీకడగంటి చూపు పూ
జడిగురియింపకున్న దివిజస్తుతివైభవగుస్థితింగి,నో ॥పడ॥ ౪

---

### మధ్వశ్రీ పల్లెపూర్ణప్రజ్ఞాచార్యవిరచితము,

టవున్ హైస్కూల్ పండితులు, గుంటూరు.

చ॥ పుడమిన గాధమైదనరు మోహమహార్ణవరాశిమధ్యలోఁ
బడినటువంటిమాకు నలపావనమైదగు నీదు నామమున్
పడవ లభింపకున్న నెటు ప్రాణము దాల్తుము మేన నింతగాఁ ॥పడ॥ ౧

చ॥ పుడమిని నెల్లమానవులు పుణ్యము సేసిన నింక నెట్టు లే
ర్పడు నలనీకు నీపతితపావననామము పాపసంచయం
బడవనిగ్రమ్ము బోటియనదల్ జనియింపకయున్న పట్టునన్ ॥పడ॥ ౨

చ॥ జడుఁడనిలేనిపోని యుపచారము నాపెడఁబెట్టి యేలన
న్నడఁపఁగ, నేను యంత్రమును నారయనెంత్రివి నీవుగాన నీ
నడపినయట్లు నే నడతు నాదగుతప్పిద మేమియింకనో
పడమట లంకరామ! ననుబాలన సేయవె జానకీపతీ॥ 3

చ॥ ఎడదలపోయఁగా జగతికెల్లను దండ్రివి నీవుగావునన్
గొడు కవివేకినై చెడుగుకొండొక సేసిన నైచిమార్గమం
దిడుటది నీకుధర్మమగు నేవిధినైనఁ దలంచిచూడఁగాఁ ॥పడ॥ ౪

చ॥ గడపితినిన్నియేండ్లు వృథాగా నవివేకవశంబుచేనిఁకం
గడచినదానికిన్ వగవఁగాఁదగదీపయి నీపదాబ్జమం
బెడతెగనట్టి భక్తినిపుడిచ్చి కృతార్థునిగానొనర్చవే ॥పడ॥ ౫

చ॥ కుడిభుజమల్లసాచిపడి ఘోరరణాంగణమందు నాఁడు క
వ్వడికి సమస్తరాజ్యవిభవంబులొసంగుట యొండుచాలదే
కడమదియేల, భక్తజనకారుణికుండని నిన్నుఁ బిల్వఁగాఁ ॥పడ॥ ౬

చ॥ పుడమిని తల్లిగర్భమునఁ బుట్టినయప్పటినుండి యాశ్రమం
పడినినుఁజూడఁగా మొగమువాచిన వాకిఁక నీదుదర్శనం
బిడుము, జడుండటంచుమది నెంచకు నీకొక రూపయుల్లరుం ॥పడ॥ ౭

చ॥ చెడినదిజ్ఞానచక్షువికఁ జీకులమైతిమిగాన మాకు సం
గడినొకదారిఁ జూపుటది గౌరవమైతగు, మంచివారలై
పడిమిటులైనమార్గమును బట్టుదురయ్య ప్రధానపేతుగా ॥పడ॥ ౮

చ॥ పడఁతులుపుత్రులాప్తులఁ బాపుదురంచని మోహమందునన్
బడి మరలంగలేక తలప్రాణము శోకకువచ్చె నేఁటికిం
బుడమిని నీవడిక్కనెడి, బుద్ధిజనించెను నిశ్చయంబుగాఁ ॥పడ॥ ౯

చ॥ పడిఘనపాపకూపమునఁ బైటికివచ్చుటకొక్కటెన్నగన్
పడకిటు, దేవులాడుననుఁ బల్మరుగాంచియుఁ గన్నులారఁ ద్రే
ముడినొకగట్టుజేర్చుటకుఁ బూనకయుండుట న్యాయమానెనో ॥పడ॥ ౧౦

## బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి విరచితము.

టవున్ హైస్కూలు పండితులు, గుంటూరు.

చ|| ఎడపక సర్వదైవత, సమీడ్య పవిత్రచరిత్రు నిన్ను నా
యెడఁదను సంస్మరింపుచు, ననేకదినాగతమైన, జన్మపుం
గొడవనడంపఁ గోరితి రఘుప్రవరా! యదియొక సాధ్యమా!
పడమటలంకరామ! ననుఁ బాలనసేయవె జానకీపతీ ||పద|| ౧

చ|| విడివడి వేదశాస్త్రపదవిశ్రుతినేని గడింపనైతిఁ జే
ర్పడినబుధేంద్రసేవగుణవర్ధనగణ్యత గాంచనైతి న
ల్గడల యశమ్ముఁ గమ్మననఘక్రియలం బచరింపనైతినో ||పద|| ౨

చ|| పుడమిజనించి బాల్యముటుపోవఁగ యౌవనమంకురింప, దుం
దుడుకు పనుల్ పొనర్చి; ఖలదుర్వ్యవహాసంగతి, పిచ్చలింపఁగి
ద్వాడి, కడుమహాభక్తి నినుదగ్గఱుపగ్గెల మ్రొగ్గమంటి, నో ||పద|| ౩

చ|| అడుగులు లెక్కవెట్టుకొని, యామడలామడ, లేగుదోగికిఁ
దడఁబడు నెట్లుకా, శ్రుతులు తంద్రబయల్పడునాకఁ, నెప్పుడె
ప్పుడునినుఁ గాంతునోయనుచుఁ బ్రొద్దులుపుచ్చుచు జడుంటనాట, నో ||పద|| ౪

చ|| “తడవుతపంబు నోములు పదల్ ననుఁ ద్రుప్తి నొసర్పఁ జాలవె
య్యెడ దృఢభక్తిమాడ్కి; నది హెచ్చి లిలేశము సంగమేరువం
చొడయఁడ నీకపల్కిత” ను యోగులమాటవరాలమూటె కా ||పద|| ౫

## నోరి హనుమచ్ఛాస్త్రి విరచితము, తెలుఁగుపండితులు,

మిషన్ కాలేజి, గుంటూరు.

చ|| జడమతితోడ సోమకుఁడు చయ్యన వేదములన్ హరించి తా
జడనిధియందు దాఁగఁగ నుజాడ నెఱింగియు మత్స్యరూపమై
కడువడి రాక్షసున్ దునిమి గ్రక్కునఁ దెచ్చితి వీవె వేదముల్ ||పద|| ౧

బ్రహ్మశ్రీ నెమ్మలూరి రామమూర్తి విరచితము.

స్కూలుమాష్టరు అమృతలూరు, గుంటూరుజల్లా.

చ॥ జడులువివేకశూన్యులు నిజంబనిజంబు గ్రహింపలేక నీ
యెడ, లఘుభావమూనినను నేశిలయంచనినంత నేమి నీ
యడుగులు గొల్వకుందురె మహాత్ములు సర్వసుపర్వకోటియో
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧

చ॥ చెడుమతిచేనహల్యఘన శిక్షకుబాల్పడిదిక్కులేని శా
గడవినినొక్కరాయియయి పొలుగరుంగగ నేడ్చి యేడ్చి నీ
యడుగులసోఁకనాయొసతి యాపదపద్మను హత్తిమెట్టిదో॥పడ॥ ౨

చ॥ సుడివడుగాలిచందమున స్రుక్కుచునీభువియందు మోహపున్
మడుగునమున్గి తెప్పరిలుమార్గము దోచదునీదయాగసం
బడిగితి యుద్ధరింతువను నాశను దేవ నీదుచిత్తమో ॥పడ॥ 3

చ॥ పిడికెడుతండులంబులకుఁ బ్రీతివహించితివందు కావుచే
లుఁడె ఘనసాక్షియాశబరిలో గొనెనెంగిలిపండ్లొసంగి భ
క్తుడనగ బ్రాణమిచ్చు గుహకోపిదమూర్తివి యావొకండవే॥పడ॥ ౪

చ॥ గడుసుఁ దనంబునన్ మదము కన్నులఁ బ్రామఁగనిక్షుహాసించు నా
జడులోకశూరినిన్ గనిసఁ జాలు నిమీలితలోచనత్వమున్
బడయరెపారవశ్యమున బాడరెయాడరెకేలుమోడ్పరే॥పడ॥

చ॥ అడవులదీక్షతో సహాగహంబు దపంబొనరించువారునే
పడయరునిన్ను భక్తజనపాల! జగన్నుతలోకరక్షకా
జడుఁడకిరాతకుండనతిచంచలచిత్తుఁడనాకుదక్కుదే ॥పడ॥ ౬

చ॥ దృఢతరభక్తినిన్ గొలువ దీనులకున్ సకలేప్సితార్థముల్
పొడమును, మోక్షరాజ్యమున బూర్ణసుఖంబులదోగుచుంద్రు నీ
యడుగులనమ్ము భక్తుల కహా!వశవర్తివియౌటెఱుంగుదో ॥పడ॥ ౭

చ॥ జడధితనూజ, యాసిరియొ, జానికి, లక్ష్మణుఁడందిశేషువా
కడుబలశాలురాకపురెకా? సురలీభువినుద్ధరింపనా
యెడజనియించితయ్య జగదీశ్వరనీవనవిష్ణువౌదువో॥పడ॥
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౮

## బ్రహ్మశ్రీ జ. సుబ్బరాయ విరచితము.

నెల్లూరు.

చ॥ జడలుధరించి కామముఖశత్రులనెల్ల జయించి నిచ్చలు
న్గడగిభవత్పదాబ్జభజనవ్రతినైష్ఠికులౌచుఁగాలముఁ
గడపెడునారదాదులును గానఁగఁజాలరునీప్రభావమో॥పడ॥ ౧

చ॥ జడనిధివేష్టితంబయిన సర్వమహీతలమేలుసార్వభౌ
ముఁడనుచుద్వాదీయచింతన విభూతి, నెసంగకయుండనేనిఁ జే
రెడవినిఁ గాచువెన్నెలటు వ్యర్థముగాఁ గదవానిభోగముల్॥పడ॥ ౨

చ॥ విడువకనీచరిత్రమును వీనులవిందుగవిన్న, నష్టయిం
పడరఁగనీదు పేరు మనసారఁ భజించిన నీసురూపముఁ
గడుకొనికన్నులారఁ బొడఁగన్న నసుంబులువాయనున్నదో॥పడ॥ ౩

చ॥ ఎడపకమాటువేసి వధియించితికోతిని శౌర్యధైర్యముల్
గడలుకొనన్ సురారివిభుఁ గాలునివీటికిఁ బుచ్చితీవు భీ
రుఁడవొ? గభీరుడో? యెఱుఁగరాదిగఁ జిత్రమునీచరిత్రమో॥పడ॥ ౪

చ॥ ఎతనెడఁబోయియాశబరి యిచ్చినయెంగిలి పండ్లదింటివే
ప్పడనిజతుల్యసోదరుని బాలనసేసితి వేమిసేయఁబా
ల్పడవు చలింపనట్టిదృఢభక్తి యొకందుప్రాసంగివేనినో॥పడ॥ ౫

చ॥ ఉడుపతి యొకందుసాయపడ మల్లమునన్ ముదమంది ప్రోచితీ
వుడుగనిభక్తి సేయుచు సముజ్వల భూషణవాహనాదుల
న్నిడశ్రీమనందు గపసను నేలవుసత్వాని మొప్ప నేలకో॥పడ॥ ౬

చ|| పాదమినభోగభోగ్యముల బొల్పెసలారదు వారుకొందరున్
గుడువాఁగూడు లేనియొకకొందఱు నీకతిబాగునోగులన్
ముడివడియున్న దీభగ మమోఘుమునీగచనావిశేషమో
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ|| ౭

చ|| జలజభవాండభాండముల జయ్యన గల్పనసేసి వానిజెం
పదరగఁ జేయుచున్దుదకునన్నియు నెట్టులో రూపుమాపగాఁ
దొడగుట కేమికారణమొ తోఁచదుచిత్రమునీదు చర్యలో ||పడ|| ౮

చ|| కడుమదమారనీదుపదకంజములన్ నెరనమ్మియుప్పుమే
ల్పడనిమొకండు లేడిల నకష్టనీకొనరించి యుప్పు గి
ద్పడనియొకండు లేడుదలపం నపూర్వగునీదుశక్తిమో ||పడ|| ౯

చ|| జడుఁదదరిద్రుడన్ బరమచంచలచిత్తుఁడనైననన్ను నె
వడువునజేరఁదీతువనిభావనసేయను వినికిన్ గశేఁ
దుర్గమను గుచేఁమారుతి తనూజులు గాకొనాకుసాక్షిమో||పడ||౧౦

చ|| పడతినిగోలుపోయి వనవాసపరిశ్రమ కోర్చియుంటియున్
జడమతులైనవానరుల సాయముగోరి నిశాచనాటులన్
వడిదునమాను టెల్ల నిజభక్తుల రక్షణకోసమేగదా ||పడ|| ౧౧

చ|| పుడమిని గోరలేదు పరిపూర్ణ సుఖమ్ములు గూర్పమంచుని
న్నడుగగలేదు నిత్యసుగు సంచితకీర్తి నొసంగుమంచు నే
నడుగగలేదు కాని మదినూల్కొను భక్తియొకండె గోరితిన్||పడ|| ౧౨

చ|| తొడవులనియ్య గాగలనో తొగవుఁ జేలములియ్య నేర్తునో
కడుముద మొప్పమందిరనికాయముగూర్పఁగలానొ నీకు నే
ర్పడనిఁ కనేమిసేయఁగల వాఁడను భక్తియొకండు దక్కనో||పడ||

చ|| కడలినిదాఁటి మేటిదశకంఠుని పీటిని జొచ్చి శత్రులన్
మడియగ చేసినీకుసల మానినివార్తలఁ దెల్పినట్టిశూ
రుఁడగు వరుత్తనూజుని నెఱుంగుదు నీప్రియభక్తుడే గదా||పడ|| ౮౧

చ|| పుడమిజనించుటాది గడు మూర్ఖత బాపము సేసిచేసి చే
డ్వడి తుద కెట్లొ తెల్వి గని భాగమునన్ నినుసన్నుతింపఁగా
గడఁగితి నిన్ను నమ్మితినిగాచెదొ, గావవొ నీదె భారమో
పడమట లంక రామ! ననుఁబాలన సేయవె జానకీపతీ! ౧౫

## బ్రిహ్మశ్రీ. వి. లక్ష్మయ్య విరచితము.

నెల్లూరు.

చ|| కొడుకుల కైన వత్సలత కూర్మియుఁ బేర్మియుఁ జూపుచుండి యా
కొడుకుల తప్పులన్నియును గూడ క్షమించునుగాదె తండ్రి నీ
కొడుకును [illegible]నాకుఁ గల కోరికలిచ్చి క్షమింపవేల రా||పడ|| ౧

చ|| వడివడఁబుణ్యతీర్థములవాసిగఁ జూచిన, ధర్మశాస్త్రముల్
గడువడినభ్యసించినను గాముని గెల్చిన ముక్తి లేదు ని
యడుగులఁ బట్టకున్న [illegible]ణాకర! భానుకులైక శేఖరా! ||పడ|| ౨

చ|| పడమటలంకలో వెలసిభక్తుల నేలుచు దుష్టసంతతిన్
మడయగఁ జేయుచుండువఁట మాప్రను జేపుననీదునామమున్
విడువక సంస్మరించినను వీడవెదుఃఖము లెట్టివైననో||పడ|| ౩

---

## బ్రిహ్మశ్రీ. కాకుటూరు రామనాధ విరచితము,

స్కూలు ఫైనల్ స్టూడెంటు, నెల్లూరు.

చ|| జడధిఁ వసించి, కూర్మమయి, క్ష్మాతలిచె త్తి నృసింహమూర్తివై
వడుగయి, రాజులం గెలిచి వారిధిఁగట్టి హాలంబుఁబట్టి, బు
ద్ధుఁడవయి కల్కివై పుడమిలో రుభారముమాన్పినట్టి రా ||పడ|| ౧

చ|| అడిగిననిచ్చునట్టిదొరకైననుగల్గఁడు గర్తసేని నా
[illegible]డుధనహీనుఁడై [illegible]నరు దర్శిమ్యముగల్గినగాలెసున్న సె
క్కుడుమల కోర్కెఁగాని భువినెప్పుడు యాచకవృత్తినొల్లనో ||పడ|| ౨

చ॥ అడుగకయుండుమన్నఁబితురార్జితమైనను లేదు సేద్యముల్
దొడఁగియొనర్పఁగా నెచటదో సెడు నేలయుఁగానరాదు నే
గడపఁగనెట్లుజీవితపుఁగాలమునంతయు దారిఁజూపుమో
పడమటలంకరామ ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ 3

చ॥ ఒడలిది యష్టకష్టముల కోర్వదు సౌఖ్యమకోరు సంతతం
బుడుగదు పాపభావముల నూర్జితచిత్తముగాన సజ్జనుల్
వడినను సేవకై కొనరు వాకొన నాకిఁకవృత్తియెయ్యదో ॥పడ॥ ౪

చ॥ కిడఁగిమహాకుపద్యములగట్టిగ భూపసభాంతరంబులన్
నుడువ నశక్తుడన్ బుధజనుల్ ధరమెచ్చఁగఁ గావ్యభావముల్
వడిఁగనిచెప్పలేనకట పాండితిచాలమి, నెంచఁబోదుతో ॥పడ॥ ౫

చ॥ ఒడికముసున్నవర్తకమునోడక సేయుదమన్న మోసమె
ప్పుడు సలుపంగదారియగుబుద్ధి జడత్వము స్వాదమె
క్కుడు దగదందుఁగానమదిగోరదు దానిని మొనర్తునో ॥పడ॥ ౬

చ॥ కడుకొని చోరవృత్తికను క్రౌర్యము నేర్పును, నేర్పు బెంచు బల్
చెడుక్రియలందుఁ బెక్కులగు చింతలకాకరమై మహాసప
జ్జనవిధిఁద్రోయుమానవుల శత్రువుకైనను గూడదద్ది గదా ॥పడ॥ ౭

చ॥ పుడమిఁగలట్టి వృత్తులఁ బొందగనెల్ల నవెట్టివైననీ
కడకటా చేరువృత్తిఁ గనగా నిలకోయుచునుందు దానిమిం
చెనదని నాకుఁ దోచదిఁకఁ జెప్పరదానికి మార్గమేదిగో ॥పడ॥ ౮

చ॥ వెడఁదశిరమ్ము సైనమొక దైర్ఘ్యనగమ్ము ఛేదంపవాయుపు
త్రుఁడనొకమహాగ్రహతిరూలఁ గవాలిని గాక నీకునే
వడయక సాపడన్ దనుజుతమ్ముఁడ నౌదునో నిన్నుఁజేరఁగా ॥పడ॥ ౯

చ॥ జడుఁడ భవత్ప్రభావమును శక్యమె సుంతియు నాకుఁ గానఁగా
నుడుపతిశేఖరాది మహిమోన్నతమూర్తులె చాలరంచనన్
విడుకకప్రోవుమయ్య యిఁకపీడను నీయెడగల్గుభక్తి గదా ॥పడ॥ ౧౦

# బ్రహ్మశ్రీ. గోపాల పిచ్చయ్యశాస్త్రి విరచితము,

శతావధాని, నెల్లూరు.

చ॥ కడుభరమైన కొండలు వికమ్మునఁ దేలు ప్లవంగమాత్రుఁడుక్
జడనిధి దాటు బల్వాలము చాయన మేయమహత్త్వమొప్పఁగాఁ
బొడవడచున్ని శాచరసమూహము, నీకృపసుంతయున్నచో
పడమటలంక రామ! ననుఁ బాలనసేయవె జానకీపతీ॥ ౧

చ॥ ఉడుగణమింతయంచు నెటులో గణుతింపగవచ్చు భాగము
న్నడువగవచ్చు నబ్ధికి గనుంగవ గాలినిఁ జూడవచ్చు గా
కడరు భవన్మహత్త్వమిదియంచన నింగన నెవ్వఁడోపు? నో ॥పడ॥ ౨

చ॥ ఉడుతయొకండు సాయమెపుడో యొక యించుక నీకుఁ జేసెనం
చడుగని పేర్మి దానికి నహోయనముక్కినొసంగితంట, యా
సడివిని నిన్నుఁ జేరితిని సామి! ను ఇట్టులనన్నుఁ జూతువో ॥పడ॥ ౩

చ॥ వడుగఁటయొల్లవిద్దెల దివస్పతియొద్దను-తూర్పుకొండపైఁ
బడమటి కొండపైఁద నదుపాదములూని-గ్రహించెనంట, యా
తఁడు భవదీయభక్తుఁడట తావకభక్తున కొండసాధ్యమా ॥పడ॥ ౪

చ॥ బడబడ కాశికేగి సప్రపంచముతోఁ బనిలేదటంచు న
ట్టడవిని ముక్కు మూసికొని యాసదపించినఁ దాదపించినన్
విడుదలలేదు సంసరణవిప్లవమందున నిన్నుఁ గొల్వకో ॥పడ॥ ౫

చ॥ పుడమిని నస్త్రజన్మునకుఁ బుట్టిన యిల్లుగఁ బూర్వకర్మచేఁ
బొడమిన దాననేమి? బుధపుంగవసన్నుత! నీపదాబ్జముల్
విడువక సంస్మరింపబడి వేలయఘంబులు దాఁటనౌఁగదా ॥బడ॥ ౬

చ॥ గడుసరికాలు బంటులకుఁ గంపము పుట్టును నీదుభక్తులే
రెడఁదఁదలంపు రచ్చినపుడెల్లను నీదగు నామమంత్రముల్
విడిచిదమనంబునాయది గణింతు నెయింక పరేతనాయకుల్ ॥పడ॥ ౭

చ॥ బడబడ బ్రోగుతా మనురసావలె వాఁగుచు వారివీరినిఁ
గడబిడజేసి జ్ఞానియనిగాని మహోత్కృష్టిగాని పేరునే
బడసినవాఁడగాను నినుఁ బ్రార్థనజేయుటె యొండె నేర్చితిఁ
బడమట లంకరామ! ననుఁ బాలన సేయవె జానకీపతీ॥ ౮

చ॥ ఘుమకుట యే నెఱుంగ మనసోడిమిమించినవారిఁ జూచినే
మిసుకుట నే నెఱుంగ పనమేలును జూడనివారిఁ జూచినే
నుడుకుట నే నెఱుంగ నినునోపిక వేఁడుటయొండు దప్పమో ॥పద॥ ౯

చ॥ గుడియొకటైన గట్టినొకగోపురమే న్వెలయింపగా వనం
బొడికముతోడ నిల్పగను, నో రఘునాయక చిల్లిగవ్వయే
గడనయొనర్ప నేర నను గన్నను గన్నన సేయుచున్నగో ॥పద॥ ౧౦

చ॥ వడివడి దానముల్సలిపి వారును వీరును తన్ను మెచ్చఁ గో
గుడ్డువగ బెట్టికొందటికి, కులుకుట ముక్తికి మార్గమా? నుదిఁ
పడలగనీక నీభజనసారెకు జేయుటమార్గమా? యహో ॥పద॥ ౧౧

చ॥ పడఁతియొకర్తు బిడ్డలకుఁ బండెడుగా భరియింపలేమిచే
గుడిపదిలమ్ము కష్టములకున్నిలయంబగు నింటికంటెయం
చెడగలుగ న్విరాగినని యెట్టులొ త్రిమ్మర నేమిలాభమో ॥పద॥ ౧౨

చ॥ విడిబడిజందెముల్వరికి వేసి వనంబులఁజేర నేటికో
ఎడపకనిందలంచు పనినెవ్వరుకాదనువారలింటిలో
కొడుకులగాంతునంచ నెడు కోడలివల్లనునత్తయుండునా ॥పద॥ ౧౩

చ॥ వడముడివంటి పెద్దబలవంతుడెయైనను సవ్యసాచిబో
లెడు రణశూరుడైనను లలిన్భవదంఘ్రిభజింపకెందు నేఁ
బడయగ నేర్చునే? యశము పాపవిశోషణ మానిషాసుతా ॥పద॥ ౧౪

చ॥ బడిశముపాపమత్స్యములపాలికి నీదగునామముండగాఁ
జిడిముడిపాటుతోడఁ దనచిత్తము నింద్రియపాలికిచ్చెలోఁ
బడి శమనప్రచారమనివార్యమనంబనియేమి? శ్రీహరీ ॥పద॥ ౧౫

చ॥ వడిచెడినీచమానవుల పాదములంబడ నేటికయ్యా? రా
ముఁడెయిఁక నాకుదిక్కనుచు ముంచినఁ దేల్చినవాఁడెయంచు నె
వ్వఁడు నిను నమ్మనో మదిని వానికి లేదిఁక నేఁగియెన్నిటఁ
బడమట లంకరామ ! ననుఁ బాలన సేయవె జానకీపతీ॥ ౧౬

చ॥ ఉడుపతిఁ గేరు నెమ్మొగము హా కడగన్నులచూడ్కు లెన్నఁగా, మేల్
పిడికెడు కొనువాహ్వా యాలివేణిఁ యాంచొక కొంతకాలముఁ
గడిపితి గామజాడ్య పరికల్పితసాంద్రతమోన్వితుండనై॥పద॥ ౧౭

చ॥ గడపితినింక కొంతకలిగానికి లోఁగుట దుష్ప్రవర్తనం
జెడితిని తెప్పరిల్లితిని చేరితి నీపదసన్నిధి న్మహా
త్ముఁడవని ప్రేమజాతువని తొంబరమాటలు జెప్పనేటికిఁ ॥పద॥

చ॥ "గశసాగసుందనమ్ముగల కామినిగూడుటయెప్డొ సంతతిఁ
బడయుటయెప్డొ" యంచు బహుభంగులఁ జింతయొనర్చుచుంటి ని
ప్పుడు భరమయ్యె సంసృతి ప్రభూ! యిఁక చాలును నిన్నుఁ జేరితిఁ ॥పద॥ ౧౯

చ॥ దుడుకుఁదనంపుఁబోకడలతో చన్పతంబగు కీర్తినీతిఁజొ
ప్పడనివిధమ్మునం ధనసుపారముగా గడియించి కష్టముల్
గుడిచి మటకన్న భక్తి నినుఁ గొల్చుటయెప్పటికైన మంచిదే ॥పద॥ ౨౦

చ॥ ఒడలు తిరమ్ముగాదదెపుడో యటనో పడిపోవు నీటిపై
బుడగవిధమ్మునం బోలుచు బొమ్మకు సొమ్ములు పోకు లేల? నీ
యడుగులఁ బూజసేయుటొకడబ్బినఁ జాలదె? వేయునేటికిఁ ॥బడ॥ ౨౧

చ॥ విడుతునె? ముష్కరమ్ము నిను వీడుదు నాసు నిన్నటన్నయా
తొఁడసాక ప్రక్కలాఁ తాపమాలిలు వేలొక ప్రక్కలాఁగగా
నడుమనుజిక్కితిన్న కొనునా డెవరడ్డము వానికింక నో ॥బడ॥ ౨౨

చ॥ కొడుకులు వెంటరారు తనకుంగలద్రవ్యము వెంటరాదు య
క్కడఁ దాతమిదన్ను గూడు సలకోమలియేనియు వెంటరాదు తా
నడుగటు పెట్టువేళకఁ బుడాదరువొక్కటి నీదు నామమే ॥పద॥ ౨3

చ॥ తొడవులు నేధరించితిని తోటలు నాటితి విప్రకోటికిన్
దొడుకులనిచ్చియుంటిని క్రతుల్ గయికొంటిని సున్న పాకుదా
తొడిమెయు వెంట రాదుగద తొల్లిటి పున్నెముపాపమున్వినా
పడమటలంక రామ! నను బాలన సేయవె జానకీపతీ॥ ౨౪

చ॥ సుడివడగొట్టు భంగములు సుంతయడంగినమీద దాటుకున్
జడధినటంచు నెంచు జడునందమునన్ గృహకర్మలెల్ల దా
గడచినమీఁదనిన్నుఁ గనఁగానగునంచుఁ దలంచుమూఢుఁడో॥పడ॥ ౨౫

చ॥ వెడగుఁదనమ్ముచేత హరి నేఁబుహాయుండననేటం మనఁ
బెడచుతికొందరెంచెదరు విజ్ఞులకీవె హరుండ వెన్న శం
భుఁడెవఁడు నీవె భేదము విభూ! యిసుమంతయుఁ గానఁబడదయ్యో నో॥పడ॥

చ॥ వెడదయురమ్ముతోడ గృపచెంగెనలారెడు చూపుతోడ నిం
పడరు మెఱుంగుకన్న సొగసైన తగుబంగరువల్వతోడ నె
ప్పుడు కనుపట్టెదో యిఁక నీ ముస్తని చెప్పుడు చేసెదోనను ॥పడ॥ ౨౭

చ॥ కడకిదియం చెఱుంగ నవకాశము లేనిది నీకు జాడ నే
గడువులనై ప్రతిజ్ఞలు ప్రగల్భములాడితి నిన్ను జూడ నీ
వొడఁబడి దర్శనంబిడెదవో, యటు సేయవో? నన్నె కాడ నో॥పడ॥ ౨౮

చ॥ పుడమినిఁబుట్టుటాది నిమ్ము మొక్కుచుఁ బాటలుపాడ వేడుకల్
వొడమఁగ దన్మయత్వమునఁ బొంగుచు నిన్గని యాడనోపికన్
బెడఁదలకోర్చి నిం గొలుచు పెద్దలఁగూడని వానికెబ్బునో ॥పడ॥ ౨౯

చ॥ మృడునకు కాక తెద్దమని మేనసగంబును గొన్నదంట యా
పడతికి గూడ నీదు పదపంకజయుగ్మము సేవ్యమౌఁగదా
బడుగుల లెక్కయేమి మహిముబాసెడువాడ! బుధాళినీడ! నో॥పడ॥ 30

చ॥ బిడియము లేక పెద్దలకుఁ బెద్దనటంచు ధనమ్ముగన్గొని నా
తడుసభ కెక్కఁగాని నిముఁదన్మయతన్ భజియించునట్టి ర
క్తుఁడె తనకంటెఁ బెద్దయని కొంచెముగాని తలంపడయ్యో నో॥పడ॥ 3౧

చ॥ పుడిమడీయంచుమూతుదురు మంచిదె, నిన్మదినమ్మితృష్ణదా
నడపఁగలేనిదేటిమడి యావడి గుమ్మడి,నన్నెఱుంగుటే
మడుగుకు ముమ్మశంగులగు మంచిబెడంగుమడుంగు సుమ్మియో
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ 3౨

చ॥ కడుఁవడి మంచి పద్యములు కల్పనసేయఁడి నేర్పుగల్గియే
గడుసరిలోభినో యకట గ్రాసపు కాసులకోసమాసచే
బడబడ వేఁడనేల నినుఁబద్యగణంబునఁ గోరఁదీరదో॥ పడ॥ 33

చ॥ జడధిశయాన నీదగు ప్రసన్నతవోలె మహాగ్రహంబుదా
నిడగలదయ్య ముక్తియది యట్టులనన్న భవచ్ఛరాళిచే
మడిసిన రావణాదులును మానుషిన్నినుఁ జేరలేదొకో॥పడ॥ 3౪

చ॥ జడయను దెబ్బలుల్గపియ ఒంటె మృగేంద్రుని కైనగాని దే
వుడెనడు గవుడెవ్వడను పోకిరి నాస్తికు గన్న నేఁడియం
పడదును విసపోష! మృదుభాష! నభోమణివంశభూషణా ॥పడ॥ 3౫

చ॥ ఆడకువ దైవభక్తికరుణాదిగుణంబులులేక మూర్ఖతన్
మిడిసిపడంగనౌనె! ఘనమే బలవంతుల నుంచౌ కింతనే
కడచునె! యొక్కరీతి దినకాలము మేలిమి నెల్లకాలమున్॥పడ॥ 3౬

చ॥ ఇడుముల నంద నేల! ననునింతగ వేడఁగనేలపోవఁ వెం
బడిబడదేల నిన్నెఱుగమా! యనెదో! నరి కన్నతల్లియే
నడుగక బెట్టదన్నమను నార్యులసామెతనీ వెఱుంగవా॥పడ॥ 3౭

---

బ్రహ్మశ్రీ. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి విరచితము,
గుంటూరు.

చ॥ప్రాఁడిమిఁ నాటినుండియును ప్రశ్నములే ప్రసరించిన్న మునీ
కడనిటు వైసిమాలియొగుగంబని యేమి జనించి పాపఫుల్
నడవడి కగ్గమైన కతనన్ నిను వేడఁతిఁ దిప్పితింగినా ॥పడ॥ ౧

చ॥ పుడమిని బాపమొక్కనికిఁ బున్నియ మొక్కనికేల యందఱన్
గడుపునఁ గన్నవారి నొకకంటఁ గనన్ దగుఁ గాదె కర్మపున్
గడనబడిన్ లభించునను గర్తవు హర్తవు నీవెగాదె గో
పడనుట లంకరామ! ననుఁ బాలన సేయవె జానకీపతీ॥ ౨

చ॥ అడరు భవాంబుధిన్ మునుఁగునట్టి విపన్నుల సంతరింపనే
ర్పడిన మహాత్మ నిన్ను నుడుపంబున గంగ తరింపఁ జేసి నా
తఁడు గుహుఁడెంత పుణ్యుఁడో గదా యటు నాకు లభింపదయ్యెగదా॥పద॥ 3

చ॥ పుడమిని మానవుండనయి పుట్టి గడించిన దేమి నీవు పే
ర్కడవుల సంచరించునపు డందొక బోయతినై పులుంగనై
కడకొక క్రోఁతినైన నినుఁ దగన్ భజియింపఁగ నోఁచనైతినో॥పద॥ ౪

చ॥ విడివడి ఘోరపాపపదవీ సుదవిభ్రమలాలసుండనై
చెడితి మహాపచారములు జేసితి ముందటికేమి దుర్గతిన్
బడయుదునో భయంపడు విపన్నుఁడ నీదరిఁ జేరినాఁడనో॥పద॥ ౫

బ్రహ్మశ్రీ. బొగ్గవరం శ్రీరామశాస్త్రి విరచితము,
నర్సారావుపేట.

చ॥ కుడియెడనాళ్ళసందున నిజోరికఁ దిగగఁ జూచువాఁడహో
యొడయఁడ! నీవుగన్పడఁగ నొప్పులకుప్పగఁ దన్మయాత్మమా
గడియనె చెంది మైమఱచి గాఢసమాధి, నిమగ్నుఁడౌఁ గదా॥పద॥ ౧

చ॥ జడమగు మేనె నేననుచు సాగ జనుల్ సా, సర్వపాపముల్
గడువడిఁ జేసి కామలవకాంక్షయుఁ దీరక యంత్యకాలమం
దడలెడు మూఢుఁడన్ మిగులనా రిపులంటిడి బిల్వఁ బోతువో॥పద॥ ౨

చ॥ ఎడ తెగకుండ రాత్రి బవలెప్పుడు నిన్ దనకంటిగాత్మగా
నడుగడుగందుఁ దత్త్వమసి యాంచును లక్షలు గోష్ఠి సాధు గాఁ
బడనిమనస్సమాధి నినుఁ బాయక చింతిలు వాఁడనీవగున్॥పద॥ 3

చ॥ నుడువులరామమంత్ర మొకనూఱు జపించినఁ జిత్తవీధిలో
నెడపడకుండనిన్ గననిహీనున కబ్బునె తత్త్వసిద్ధిలో
గడిసుకృతంబు నీదయయు గల్గినవాఁడెపొ నీవెదానగున్
బడమట లంకరాము! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౪

చ॥ గుడితనువెల్ల ప్రాణములుగోప్యఘటుల్, మతిసీతమాంబమై
బడలికగాఢనిద్రయెనిబద్ధసమాధి, పదప్రచారముల్
విడువనివిప్రదక్షిణలు వెర్వకపల్కెద నేనెనీవు శ్రీ ॥పద॥ ౫

చ॥ గడుసుదనంబుగాదువిను కాయము నేననుకున్న దాసుఁడన్
విడువక నేనుజీవుఁడనువేళ హరీ! భవదంశజాతుఁడన్
ఒడియకనాత్మనేనగ స్వామివహరిన్ వినునీవె నేను శ్రీ ॥పద॥ ౬

చ॥ జడుపాకయింతలేదువిను సర్వమునీవని వేదశాస్త్రముల్
విడువక వేదవేత్తలును వేయువిధంబులఁ జాటుచుండఁగా
నడిగెద నేను నే నెటులనయ్యెద నయ్యెయునీవె నేను శ్రీ ॥పద॥ ౭

చ॥ గడియకునూఱుపద్యములు కల్పనజేతుఁగదేమి ప్రజ్ఞగా
నుడివినయన్నియక్కరలు నోటవచించిన సాఖ్యమొంకృతిన్
బొడమెఁదదర్థమేనెనినుఁబొందితి దీనినిదెల్పరేకవుల్ ॥పద॥ ౮

చ॥ జడమనృతంబశాంతి, దుఃసంఘటితోద్యము జ్ఞానసత్యముల్
బడయననంతమోదమని బ్రహ్మమునుల్ పలుమారుబోధతో
నొడబడశిష్యసంఘములకొప్పుగఁజెప్పెద రెప్పునిన్నె కా ॥పద॥ ౯

చ॥ కుడిచియుఁగూరుచుండినిను గోర్కెలుదీర మనంబునందు ని
త్యుఁడవనిశుద్ధబుద్ధపరితుష్టవిముక్త విశిష్టభావ్యగా
నొడలునవిశ్వవిస్మృతిననూనతనొందినవాఁడెనీవగున్ ॥పద॥ ౧౦

చ॥ కుడిచెడిసంసరాంబునిధి శోకముమోహము కోపరాగముల్
గడువడిభంగసంచయముకై వడి ముంచగఁగుయ్యొమొఱ్ఱో నేఁ
గడువగఁజాలఁగావుమనుగ్రహించి నన్‌బ్రోవు మహానుభావ శ్రీ ॥పద॥ ౧౧

చ॥ జడము గుణత్రయాత్మకము సాంతప్రధానము సత్వభాగమే
వడిగలమాయ తత్ప్రకృతిభాగములన్నియవిద్య వానియం
దెడప్రతిబింబితాత్మయగు నీశ్వరజీవులు మిధ్యలైరియ
య్యెడనిఖిలాత్మ వొక్కఁడవహీనగుణాంబుధి! నీవె నేనుశ్రీ
పదమట లంకరామ ? ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧౨

సంపూర్ణము.



# శుద్ధపత్రిక.

---

| పేజి. | పఙ్త్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 4 | నినుబాలన | ననుంబాలన |
| 5 | 12 | నావిడివితి | వావిడిచితి |
| 6 | 2 | ష్టిఁడు-ప్రసిద్ధ | షుఁడు-విశుద్ధ |
| డిటో | 15 | సనుం | సనుక |
| డిటో | 17 | శ క్తినదు | శక్తియాడు |
| 7 | 1 | నికు | నీకు |
| డిటో | 7 | నడిదెగ | నడిగెద |
| డిటో | 12 | గడగి | గడిగి |
| 10 | 2 | వెంత్రివి | యంత్రివి |
| డిటో | 6 | సైచి | సైచి |
| డిటో | 8 | వృధాగా | వృథగా |
| 13 | 1 | ఒడెచెదు | ఒడిచెదు |
| 14 | 10 | రుద్ధరింతు | నుద్ధరింతు |
| డిటో | 21 | దోగుచుంగ్రు | దూగుచుంద్రు |
| 15 | 6 | నైష్టికు | నైష్ఠికు |
| 16 | 1 | భోగ్యము | భాగ్యము |
| 28 | 14 | గ్ఘు | ర్ఘ |
| ,, | 20 | న్నయునీ | యున్ననీ |

---

